చందూరీస్ (2)

# రోమాన్సు

(మూడు కథలు)



రచయిత:

## క్షీరసాగరం



పబ్లిషర్సు:
చందూరి పబ్లికేషన్సు,
(ప్రొప్రయిటర్: చందూరి నాగేశ్వరరావు)
పవరుపేట, ఏలూరు.

# విషయసూచిక



# రోమాన్సు



శనివారం మధ్యాహ్నం రెండు గంటలకి రామారావు బుర్ర ఆలోచనా పరంపరలో మునిగిపోయింది. హక్కు చిరస్థాయిగా ఒకరిది అయింది. హృదయం మహోత్కర్షని పొంగిస్తోంది. అంచేతనే రామారావుకి అంత ప్రశాంతి. పాకెట్ లోంచి చిట్టచివర గోల్డుఫ్లేక్ ముట్టించి నిమీలిత నేత్రాడై ఆలోచిస్తున్నాడు. ముందు వున్న టేబుల్ కాగితాలతో చిందరవందరగా వుంది. ఉపరిభాగం వీక్షిస్తూ సిగరెట్టు పొగ వుంగరాలు వుంగరాలుగా వదుల్తున్నాడు. ఏవో వూహాలు, ఏవో సున్నితమైన మనోభావాలు, ఏవో ఏవో అతణ్ని ఈ ప్రపంచంలో నుంచి లాగేసుకొని యింకో ప్రపంచంలోకి తీసుకుపోయినై. సిగరెట్టు పూర్తిగా వూదేసాడు. సిగరెట్టు పూర్తి అయిపోయిందనీ, అది యింకా తన రెండువేళ్ళ మధ్యనూ వుంటే వేళ్లు కాలుతాయనీ జ్ఞానం అతనికి వుంటేగా? అతను ఈ ప్రపంచంలోనే లేడు. మానవుడి ప్రతివాంఛనీ నియమాల్లోనూ, నిష్ఠల్లోనూ, అరికట్టే ఈ భౌతిక ప్రపంచాన్ని వదిలేసి, వూహాప్రపంచంలో తికమకలుపడుతూ ఆకాశహార్మ్యాలు

నిర్మిస్తున్నాడు. సిగరెట్టు నిప్పు వేళ్ళకి తగిలి చురుక్కుమనగానే అతనికి ఇంద్రియజ్ఞానం (Sensation) కలిగింది.

ఉదయం పది గంటల నుంచీ రామారావు మనస్సు మనస్సులో లేదు. మూడు సంవత్సరాలకి పూర్వం అతని హృదయంలో పారిన ప్రవాహాలూ, ఆదర్శాలూ, ఆశలూ, ఆశయాలూ మళ్ళీ రేకెత్తినై. మూడేళ్ళకి పూర్వం అతని మనస్సు కోర్కెల కుప్ప. ఇప్పుడో ? అన్ని కోర్కెలూ తీరినై. ఆఖరుకి,—తన భార్య స్కూలుఫైనలు దాకా అయినా చదువుకోలేదనే చింత కూడా అతన్ని ఎక్కువగా బాధించడం లేదు. అతను జయరాం అండ్ ఆనందరాం కంపెనీకి మేనేజరు అయాడు. నెలకి మూడు వందల రూపాయిలు తీసుకుంటున్నాడు. పైగా, ఆ కంపెనీలో అతనికి ఒక చిన్న వాటా కూడాను. దోమలూ, మంత్రులూ వుండే మాంబళంలో నివాసం. ఒక చిన్న మేడ. దానిచుట్టూ పూల మొక్కలూ ఇంకా...యింకా ఒక చిన్న మోరిస్ కారూ... ఒక చిన్న పాపాయీ. రామారావు భార్య సరళ స్వచ్ఛమైన హిందూబాలామ. అతను ధనార్జనలో పడిపోయాడు. గృహిణీ...గృహమూ. సంసార తాపత్రయమూ. ః విత్త మెలికలు లేకుండా Smooth గా గడిచిపోతోంది.

లక్ష్మీవారం వుదయం గుంటూరు కాలేజీలో ఇంటర్ చదువుతున్న లలిత రామారావు పెట్టెలో కాలు పెట్టేసమూ

సరళ యింటిలోని చెంబులూం తప్పేలాలూ అనవసరంగా జారి విడవడమూ ఒకేసారి ప్రారంభమయినై. ఎనిమిదిన్నరయినా కూడా రామారావు నిద్రనుంచి లేవకపోవడంచేత 'బావా! జ్ఞాపకం వున్నానా ?' అంటూ లలిత అతని వీపు తట్టుతూ లేపడమూ, కళ్లు తుడుచుకుంటూ వెర్రి మొర్రి ప్రశ్నలు వేస్తూ అతను లేవడమూ, అతని నిద్ర కళ్లల్లోనూ ఆమె ఆశాస్ఫూరిత వీక్షణాల్లోనూ రోమాన్సు మొలకెత్తడము ఈ కథకి రెండో మెట్టు.

అతనికి యిరవై నాలుగు. ఆమెకి పందొమ్మిది. అతని చేతినిండా డబ్బూ; ఆమె హృదయంనిండా కోర్కెలూ. రోమాన్సు కాక మరింకేమిటి ? ??

లక్ష్మివారమల్లా లలిత రసోక్తుల్లోనూ, రామారావు నవ్వుతాల్లోనూ, సరళ ధుమధుమల్లోనూ గడిచిపోయింది. ఎంత బంధువయినా రామారావు లలితని,—పాశ్చాత్య సంపర్కంలో పెరిగిన లలితని రాసుకుపూసుకు తిరగడం సరళకి మొట్టమొదట అంతగా మనస్కరించలేదు.

కాల ఖర్మనశాత్తూ సరళ శుక్రవారం వాకట చేరింది. ఆరోజు మధ్యాహ్నం భర్తకి ఒక్క చురక తగిలించింది. "ఇవ్వాళ నేను బయట చేరాను కదా ! ఇంక నిరాటంకం. ముసలిముండ నూ అమ్మకి మీా గొడవలేం తెలుస్తాయి ?

నేను యింటిలో లేననే లోటు తీర్చేందుకు లలిత వుంది కాదూ ?"

ఆ చురక అతనిపట్ల విషమించింది. రామారావు మొహం ఎర్రబారింది. తన భార్య తనమీద అంత రైట్ అండ్ లెఫ్టుగా, నింద మోపడం అతను సహించలేక పోయాడు. రోషం కలిగింది. "డామిట్" అని కాఫీ కప్పు అహంకారంతో నేలకేసి కొట్టి వెళ్ళి పోయాడు.

వున్నమాట అంటే అంత వులుకెందుకో అనుకొంది సరళ.

అతనా కోపంతో శనివారం వుదయందాకా యింటి మొహమేచూడలేదు. తొమ్మిది గంటలవేళ యింటికివచ్చాడు. సరళ గతరాత్రి కడుపు నొప్పిగా వుందని భోంచెయ్యలేదు. శనివారం స్నానం చెయ్యకుండా కాఫీ తాగుతానా అని రామారావు వచ్చేదాకా కాఫీ అయినా తాగలేదు. లలితకి ఈ గొడవేమీ అర్థమవలేదు.

లలిత మధ్యాహ్నం ఒంటి గంటన్నరదాకా చూసింది. ఆమెకి ఏమీ పాలుపోవడం లేదు. సరళ అల్లికకుట్ల విషయమూ, తన వడ్డాణంలోని నంపుల సంగతీ, తన పుట్టింటివారి ప్రతిభా తన అత్తవారింటి లోభిత్వమూ సావిత్రీ గౌరీదేవి వ్రత మహాత్యమూ చెపుతుంది. సరళ తల్లి తను ఈ సంవత్సరం

ఎలాగయినా సరే లక్షవత్తుల వ్రతం చేసుకుంటాననీ, రామేశ్వరం వెళ్ళివస్తాననీ అంటుంది. పిల్లాడు కాసేపు నవ్వుతాడు. కాసేపు ఏడుస్తాడు. బావ చాలా ముభావనగా వుంటున్నాడు.

రెండున్నర అయింది. రామారావింకా అలా ఆలోచిస్తూనే వున్నాడు. నెత్తిని చెయ్యి పెట్టుకు మరీ ఆలోచిస్తున్నాడు. లలిత తలుపు తోసుకు లోపలికి వచ్చింది. రామారావు ఆమెని పరకాయించిచూసాడు. అల్లలలాడే లోలకులూ, వంపులు తిరిగిన వుంగరాలజుట్టూ ఆమె లేతగులాబిరంగు చెక్కిళ్ళకి నూత్నకాంతిని గొని తెచ్చాయి. మెళ్ళో మెరుస్తున్న రవ్వల నెక్ లేసు అతని దృష్టుల్ని వూదారంగు సిల్కు-జాకెట్ దాకా లాక్కుపోయింది. ఆమె ధరించిన తెల్ల సిల్కు-చీరెకీ వూదా జాకెట్ కీ కలయిక సరిపడిందని ఎంతో మెచ్చుకొన్నాడు. ఆమెని అమాంత్రం ముద్దు పెట్టుకొందామనుకొన్నాడు, కాని ఆ సాహసం అతనిలో లేకపోయింది.

అతని మొదటిప్రశ్న : "సరళ ఏం చేస్తోంది?"

"నిద్రపోతోంది."

"సినిమాకి పోదామా ?"

ఆమెకి ప్రాణం లేచి వచ్చింది. ఊఁ అన్నట్లు తల పంకించింది.

## 2

కారు యింట్లో నుంచి వీధిలోకి వెళ్ళేదాకా సరళకి మెలకువే రాలేదు. మెలకువ వచ్చిన తర్వాత కసురుకొని, కాఫీ బాగుండలేదని పారబోసి, అభమూ శుభమూ తెలీని ఏడాది వయస్సుగల కుర్రాడి వీపు పెట్లగొట్టి దాసీదాన్ని మానిపిస్తానని బెదిరించి తల్లిని అనవసరంగా సాధించింది. సాయింత్రం ఏడయిన తర్వాత ఆమె మనస్సు కుదుటపడింది. నిరాశతో 'ప్చ' అంది.

స్టీరింగ్ దగ్గిర రామారావూ పక్కనే లలితా కూచున్నారు. కారు బజుల్లా రోడ్డు దాటిపోయింది.

"ఎక్కడికి పోదాం లలితా ?"

"నీకు ఎక్కడికి తీసుకువెళ్లాలని వుంటే అక్కడికి వస్తాను."

రామారావు తన ఎడంచేత్తో లలిత శిరోజాలు నిమురుదామనుకొన్నాడు. కాని అతని వేళ్ళు వణికినై.

అతను "ల...లి...తా" అని సంబోధించాడు. ఆ అక్షరాలు నాలిక చివరనుంచి వెలువడినవికావు. హృదయాంతకుహరంలో నుంచి బయటపడినై.

"ఏం ?" అని అంది ఆమె, చాలా తేలికగా పురుషుడు తన్ను గురించి బాధపడ్తూ వుంటే స్త్రీ ఎంతో చులకనగా మాట్లాడటం సహజమే కాదూ !

క్రవున్ టాకీస్ దగ్గిరికి వెళ్ళేటప్పటికి 3-40 అయింది. అప్పటి కప్పుడే సినీమా మొదలెట్టి గంట అవుతుంది.

రామారావు: "ఇప్పుడు సినీమా కేమిటి, బీచికిపోదాం!"

లలిత: "ఇప్పుడు బీచేమిటి, యింత ఎండలో !"

దారిలోవున్న రామక్రిష్ణా లంచ్ హోము దగ్గర కారుకి బ్రేకుపడింది. లలిత వద్దు వద్దంటూనే మూడు ప్లేట్ల హల్వా, రెండు ప్లేట్ల అయిస్క్రీమూ తినేసింది. ఎలా అవుతేనేం, రామారావు రు 1-4-3 చెల్లించాడు.

లలిత లంచ్ హోములో కాఫీ తీసుకొన్నంతసేపూ చిన్నప్పట్నుంచీ సిటీలో పెరిగిన పిల్లలా ఎంతో హుషారుగా కబుర్లు చెప్పడం మొదలెట్టింది. చెప్పినమాట చెప్పకుండా వింటున్న వ్యక్తికి విసుగు లేకుండా కబుర్లు చెప్పింది. సరళ కాకినాడ నుంచి మద్రాస్ వచ్చి మూడేళ్ళయినా ఒక్కనాడు కూడా తనతో అంత ఫ్రీగా మాట్లాడలేదని రామారావు హృదయంలో కుమిలిపోయాడు. లలితలాటి కాలేజి గరల్ని తనకి పెళ్ళాంగా చెయ్యక సరళలాటి వనితా శిరోరత్నాన్ని తనకి యిల్లాలుగా చేసినందుకు విధాతని నిందించాడు.

లలిత హోటల్లో నుంచి యివతలకి వచ్చేసరికి తన స్నేహితులూ, తన తండ్రి ప్రాక్టీసూ, తనకి అవబోయే భర్తా, తనకి ప్రొఫెసర్ లవ్ లెటర్ వ్రాస్తే ఏం జబాబు చెప్పిందో, హిందూ సంఘంలో స్త్రీకి స్థానం ఎక్కడో, తనకి యేయే కూరలు యిష్టమో మొదలగు విషయాలన్నీ ఏకరువుపెట్టింది.

కిళ్ళీలు నముల్తూ యిద్దరూ కారు ఎక్కారు. ఎండ ముఖాలమీద పడ్తోంది. ఒకర్నొకరు చూసి ముసిముసి నవ్వులు నవ్వుకుంటున్నారు. ఎందుకు నవ్వుకుంటున్నారో వారికే తెలీదు.

కారు బీచి రోడ్డు పట్టింది. నెమ్మదిగానూ సున్నితంగానూ పోతోంది. లలిత పైట బ్రూచిని ధిక్కరిస్తోంది. ఆ పైన గంతులు వెయ్యడం ప్రారంభించింది. శిరోజాలు బూమలాడడం మొదలెట్టాయి. పైటని ఎగరకుండా గట్టిగా పట్టుకొంది. రామారావు ఎడంచెయ్యి లలిత శిరోజాల్ని సవరిస్తూ ఆమె ఎడంభుజం స్థానంగా చేసుకొందామా అనుకుంటోంది. రామారావు మళ్ళీ 'ల...లి...తా' అన్నాడు సెంటిమెంటల్‌గా. "స్టీరింగ్ రెండు చేతుల్తోనూ పట్టుకో బావా" అని మేనమామ కొడుకుని వారిస్తూ, తన శిరస్సుని అతని భుజంమీదికి వయ్యారంగా వరిగింపజేసింది ఆ వయ్యారిభామ. అతను తలొగ్గినాడు. సరళ ఒక్కనాడయినా తను కారు

నడుపుతూవుంటే తనభుజంమీదికి అంత అప్యాయంతో వరగ లేననీ ఎప్పుడూ తలకాయ నొప్పి, కాళ్ల నొప్పులూ, నడుం నొప్పి, నోములూ, వ్రతాలూ అని కంప్లయింట్ చేస్తుందని అతని క్షోభ.

కారు మెరీనా బీచిదగ్గిర ఆగింది. "కారులోనే కూచుందామా లేక, అలా యిసుకలోకి వెళ్ళివద్దామా?" అని రామారావు ప్రశ్నించాడు.

లలిత కొంటెతనంగా అతని మొహంలోకి చూస్తూ, "నీ యిష్టం" అని అంది.

"యిసుకలోకి పోదాం" అంటూ రామారావు కారు దిగాడు.

ఎడంచేతి గోళ్ళు కొరుక్కుంటూ యిటూ అటూ తేరబారి చూస్తూ లలిత కూడా దిగింది.

రామారావు షివల్‌రస్‌గా తన చిటికెనవేలు లలితకి అందిచ్చాడు. లలిత అతని చిటికెనవేలు పట్టుకోక అతని పక్కనే నడవ ప్రారంభించింది. ఇసుకలో కాసేపు పచారు చేసారు.

అతను చేతితో తల ఆనుకొని ఇసుకలో పడుకొన్నాడు. ఆమె కూర్చునుంది.

"లలితా, ప్రకృతి ఎంత ఆనందమయమో చూడు!"

లలిత మాట్లాడకుండా ఏమిటో ఆలోచిస్తూ కూచుంది.

రామారావు మొహంమీద పడ్తున్న సిల్కు క్రైని పక్కకి తొలిగించుకుంటూ "లలితా, సముద్రుడు మనల్ని చూసేకాబోలు ఎంతో ఉత్సాహంతో గంతులువేస్తున్నాడు," అని అన్నాడు.

లలిత అప్పటికికూడా మాట్లాడలేదు. నిశ్శబ్దదేవతనే కౌగలించుకొనివుంది.

"లలితా నేను నిన్ను ఒకటి అడుగుతాను; ఇస్తావా ?"

ఏమిటదని వుత్తరక్షణంలో ప్రశ్నించింది లలిత.

"ఇస్తానంటే చెప్తాను."

"నీకు ఏం కావాలో చెప్పు."

"చెప్పనా ?"

"చెప్పు. అంత భయపడ్తావెందుకు ?" లలిత చిరునవ్వు నవ్వింది.

"నువ్వు కావాలి, లలితా !"

"నేనా ? ఎందుకు ??"

"నేను నిన్ను ప్రేమిస్తున్నాను."

"నన్ను ప్రేమించడమేమిటి ? సరళని ప్రేమించు."

"కాదు, నువ్వు నాకు కావాలి"

"సరళ వుండగా నేనెందుకు ?

..........

"సినీమాకి వేళవుతోంది లే" అని అంటూ లలిత రామారావుని లేవదీసింది. రామారావు బుర్రలో బూచులాడుతున్నాయి. లలిత తనదై పోవాలని అతని వాంఛ.

కారు మవుంట్ రోడ్డువెపు నడుపుతూ రామారావు మళ్ళీ అందుకొన్నాడు: "లలితా నేను నిన్ను ప్రేమిస్తున్నాను."

"ప్రేమించకు."

"ఏం ?"

"నువ్వు అసౌఖ్యాలకి గురి అవుతావు."

"ఎలా ?"

"నీ గృహజీవనంలో సౌమ్యత వుండదు."

"లలితా, నువ్వు నన్ను ప్రేమిస్తున్నావా ?"

"లేదు."

"ఎప్పుడయినా ఎవరినయినా ప్రేమించావా ?"

"ఏమో !"

"ఇక ముందయినా ప్రేమిస్తావా ?"

"నాకు జోస్యం తెలీదు."

రామారావు రెండు చేతుల్తోనూ స్టీరింగ్ పట్టుకొని లలిత మొహాన్ని పరకాయించి చూసాడు. లలిత యింత పిచ్చివాడేమిటన్నట్లు అతని కళ్ళల్లోకి చూస్తూ మందహాసం చేసింది.

తిరిగి తిరిగి ఎలిఫిన్‌స్టోన్ టాకీస్ వద్దకి వచ్చి కారు ఆగిపోయింది. రామారావు పర్సులో రెండురూపాయిలపావలా వెలితి అయింది. అన్ని ఫిల్ముల్లోకి మల్లెనే ఆఫిల్ములో కూడా నాయకుడు నాయిక ప్రేమ కోసం ప్రాణాలు కూడా ధార పొయ్యడానికి సంసిద్ధుడై చరించినప్పుడు రామారావు అన్నాడు: "లలితా వసంతములోని కోకిలాగానము కంటె మృదుమధుర మైన ప్రేమ, చకోరపక్షికి చంద్రుడిమీద వుండే మమత కంటె ఎక్కువగా కాంక్షలూరించే ప్రేమ, అబద్ధాల్తోనూ అన్యాయా ల్తోనూ అసంతృప్తితోనూ నిస్తేజమైపోయిన ఈ ప్రపంచంలో హృదయం వున్న పురుషుడు వాంఛించే ప్రేమ ఆ నాయ కుడిలో వుంది-చూడు."

రామారావు మొహం వంక లలిత తేరిపారి జూచి, "ఏం, బావా, సినిమాలో కూడా భావకపిత్వమేనా?" అని అంది.

రామారావు నిస్సబ్ధుడై పోయి దగ్గిరిలోనే నుంచున్న బాయ్‌ని రెండు కలర్సు తీసుకురమ్మన్నాడు.

మళ్ళీ పూరంతా ఒక సారి ప్రదక్షిణం చేసి ఇల్లు చేరుకొనేటప్పటికి పది అయింది. కార్లో వస్తూ రామారావు మళ్ళీ మొదలెట్టాడు.

"లలితా, ఒక దినం—ఒకే దినం—ఆధారంగానూ ఆదర్శంగానూ చేసుకొని ఈ జీవితమంతా గడపవచ్చును."

"ఇంకో రెండు నెలల్లో నాకూ పెళ్ళయిపోతుంది. ఈ కొద్దిరోజుల్లోనూ నేను నీచంగా ప్రవర్తించడం తగనిపని, అదీ కాక మీ సంసారానికి చిచ్చుపెట్టినదాన్ని అవుతాను. వెర్రి దారి పట్టకు బావా!"

"లలితా, నువ్వు నా ప్రేమ జ్యోతివి. నా జీవనాధారానివి......" అంటూ లలిత కళ్ళల్లోకి కాంక్షతో చూసాడు.

"అయితే ఏమంటావ్ ?"

"లలితా, అర్థమవనట్లు నా నోటమ్మటే చెప్పిద్దామని ఎందుకు ప్రయత్నిస్తావ్ ?"

"ఏమిటి ?"

"ఇవ్వాళ......"

ఏమిటో చెప్పబోయి, ఆమె ఛళ్ళున చెంపకాయ కొడ్తుందేమో అన్నంత భయంతో వెనక్కి తగ్గాడు.

ఆమె అంది : "తప్పు కాదూ!! నువ్వుకూడా అజ్ఞానంలో పడితే ఎలా?"

"అజ్ఞానం కాదు. ప్రేమ."

వెటకారంతో: "ప్రే...మా!"

"అవును. ఈ హృదయం విప్పి చూడు." ఇంకా ఏమిటో చెప్పబోయాడు. కారు అతనికి తెలీకుండానే గుమ్మందగ్గర ఆగడమూ, వణుకుతున్న పెదవులు ఆమె పెదవుల్ని వెతుక్కోవడమూ, అధరసుధారసాస్వాదనమూ ఒకే క్షణంలో జరిగిపై.

ఇంట్లోకి వెళ్ళారు. అంతా నిశ్శబ్దంగావుంది. హాలులోనే అందరూ నిద్రపోతున్నారు. వీధి తలుపు తెరిచివుంచే నిశ్చింతగా నిద్రపోతున్నారు. సరళ పక్కలోనే కుర్రాడు పడుకొన్నాడు. అత్తగారు కొద్దిదూరంలోనే చాప వేసుకుపడుకొంది.

"అత్తగారిని లేపు. అన్నం తిందాం"—అని అన్నాడు రామారావు.

"నాకు అన్నమూవద్దూ, ధ్యానమూ వద్దు. చాప ఎక్కడవుంటుందో చెప్పు. మీ అత్తగారి పక్కని చాపవేసుకు పడుకుంటాను."

"నిన్నటికి మల్లే మేడమీదనే పడుకొందువుగానిలే!"

"బాబోయ్ ! మేడమీాదే ! ! ఇంకేం లేదు."

"రామారావు ఆశాలత చిగర్చడానికీ మాడిపోవడానికీ మధ్య అయిదునిముషాలుకూడా గడవలేదు. సరిగా నాలుగు నిముషాలకిపూర్వం తనకోర్కెలు ఈడేరినాయనీ తన జీవితం ధన్యమయిందనీ తనవాంఛలు సఫలీకృతం అవుతాయనీ వుబ్బి తబ్బిబ్బయి పోయాడు. ఇప్పుడో ? లలిత గమ్మత్తుగా ప్రవర్తిస్తోంది."

"రా, లలితా."

"నేను మేడమీాద పడుకోను."

"కిందని దోమలు విపరీతంగా వున్నాయి, నీ చెక్కిళ్లు కందిపోతాయి."

"పోనీలే."

"మేడమీాదయితే దోమతెరలో పడుకోవచ్చు"

"నేను రానంటూంటే !"

"బతిమాలుకుంటాను లలితా !"

"ఊహుం"

"నీజీవితంలో నిన్నెవరూ యింతలా ప్రేమించరు."

"నీప్రేమకీ, నీకూ గుడ్‌నైట్. పోయి పడుకో."

రామారావు హృదయంలో ఆ మాటలు శూలాలలా గుచ్చుకొన్నాయి. తను, ఒక అవివాహితను, మీదుమిక్కిలి తన బంధువుని కామేచ్ఛకోసం బాధ పెడ్తున్నానా అని తర్కిం చుకోవడం మొదలెట్టాడు. లలిత రామారావు అత్తగారి చాప మీద చోటుచేసుకు పడుక్కొంది.

రామారావు తేలిపోయే కాళ్లతోనూ, కుంగిపోయే హృదయంతోనూ, మేడమెట్లన్నీ ఎక్కాడు. ఎలక్ట్రిక్ స్విచ్ నొక్కాడు. పడకగది తలుపు వోరగావుంది. హాల్లోని సోఫాలో చతికిలపడ్డాడు. సూటు విప్పుకొందామనే భావం కూడా అతనికి తట్టలేదు. ఎదురుగుండావున్న మేజాబల్లమీద "హిందూ" వుంది. ఏమీతోచక పేజీలు తిరగేసాడు. అన్ని పేజీలూ తిరగేసి విసుగుతో పేపరు నేలకేసి కొట్టాడు.

తనజీవితంలోని ఆశలన్నీ నిరాశలై పోయినాయనీ, తన ప్రేమప్రవాహం సహారా ఎడారిలోనుంచి పారిందనీ, తన జీవితానికి యింక HOPE అనేదిలేదనీ, HOPE లేని జీవితం కంటె మరణమే మేలనీ ఏమిటో రామారావు పిచ్చిగా ఆలో చిస్తున్నాడు.

ఇక కిందనివున్న లలితో?

చాపమీద ఆమె చాలా చీకాకుపడుతోంది. నల్లులో, ఏవో కుడుతున్నాయికూడాను. ఇటూఅటూ దొర్లుతోంది.

అష్టమిచంద్రుడు ఆమె మొహంమీద పడ్డప్పుడల్లా ఆమె తల పోసేది: "జీవితం చంద్రుడు యీ కాసేపటిలో ఎలా అస్తమిస్తాడో అలాగే అస్తమిస్తుంది, జీవితచంద్రుడు అస్తమించే లోపునేకదా ఈ నిర్మల శీతల కాంతీ, ఈ తేజస్సూ! ఆపైన అంతా అయోమయమే !"

మరుక్షణంలో నీచం, వ్యభిచారం, కళంకం, మొదలైన పదాలన్నీ ఆమె లేతమెదడుని భీభత్సంతో నింపేసేవి.

నైట్‌క్వీన్ వాసనని ఆఘ్రాణించగానే ఆమెహృదయం అనుకొనేది: "అయ్యో! ఈ నైట్‌క్వీన్ వాసన ఈరాత్రికే కదా! తెల్లవారితే అంతా నాశనం. ఆ పరిమళమే వుండదు. అసలు, దానిపేరే మర్చిపోతాం. జీవితంలో కూడా యింత సువాసనవుంది కదా!

"రామారావు ఏంచేస్తూవుంటాడు? నాకు మల్లేనే నిద్రపట్టక అటూయిటూ దొర్లుతూ వుంటాడా, లేక, ఏదైనా చదువుకుంటూవుంటాడా? నేనిప్పుడుపోయి అతనిదగ్గిర నుంచుంటే అతనెంత ఆనందిస్తాడు? అతని వెనకవైపుకివెళ్ళి రెండుకళ్ళూ మూస్తే ఎంత సంతోషిస్తాడు? నామీద ముద్దుల వర్షంకురిపించేస్తాడు. నాకు కాదు ఏ స్త్రీకయినాసరే, కావలసిందంతకంటె ఏముంది? ఏం వెర్రి? తప్పు. చెయ్యకూడనిపని.

నాకు కాబోయే భర్తని మోసం చెయ్యడం. నిశ్చింతగా నిద్ర పోతున్న సరళకి ద్రోహం చెయ్యడం. అతను మేడమీద వున్నాడు. నేను కింద వున్నాను. అతనికీ, నాకూ మధ్య ఒక మహాసముద్రం వుంది. ఒక హిమాలయం అడ్డం నుంచుంది. అతని ఆత్మ నాకోసం ఎంత క్షోభిస్తోందో? నిజంగా అతని కళ్ళవెంట అశ్రుధారలే వస్తున్నాయేమో! లలితా, ఒక్కరోజు ఆదర్శంగా చేసుకొని ఈజీవితమంతా గడపవచ్చు నని అన్నాడు. అబ్బ; నామీద ఎంతకాంక్షో! ఎంత మోహమో!! సినీమాలో నేను అతని భుజంమీదికి వరిగి నప్పుడల్లా అతను అమితానందం పొందేవాడు. అబ్బ! నిజంగా అతనిది వుత్కృష్టమయిన ప్రేమ! పాపం! నా కోసం ఎంత పరితపిస్తున్నాడో!„

అలా వూహిస్తూ ఆమె పరాకుగా వుంది. హాల్లోని గడియారం పన్నెండు గణగణ కొట్టింది. మేడ మెట్లమీద అలికిడి అయింది.

రామారావు పిల్లిలా మేడ మెట్లు దిగాడు. లలిత పరిశీలించింది. అతను ఆమె దగ్గిరికి వెళ్ళాడు. ఆమె గాఢనిద్రలో వుంటుందని అతను భ్రమించాడు. కాని కళ్ళు తెరుచుకొని చూస్తూనే వుంది. అతను తన మోకాళ్ళమీద కూచుని 'ల...లి...తా' అన్నాడు. అక్షరాలు వేడినిట్టూర్పుతో సహా బయటపడినై.

"ఏం ?" అని అంది లలిత, కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ.

"కళ్ళవెంట నీళ్ళెందుకు వస్తున్నాయి, లలితా ?"

"నీ అవస్థచూస్తే."

"మేడమీాదికి రావూ ?"

"వస్తానులే, నువ్వు వెళ్ళు. ఇంతదాకా సూటయినా విప్పుకోలేదేం ?"

"నిజంగా వస్తావా ?"

"........."

"తప్పకుండా వస్తావా, లలితా !"

"నడుస్తూ వుండు."

ఈర్ష్యచేత సరళ ఆఖరుకి పక్కకూడా సరిగా వేయించి వుండదనుకుంటూ రామారావు పడకగది తలుపులు లోనికి తోసాడు. గది దినమూాకంటె ఎంతో పరిశుభ్రంగా వుంది. డ్రెస్సింగ్ టేబుల్ మీాద వెండి పళ్ళెంవుంది. దాన్లో నాలుగు యాపిల్సూ, రెండు బత్తాయిలూ, నాలుగు అరటిపళ్ళూ వున్నాయి. యాపిల్సు కోసుకొనేందుకు కాబోలు పళ్ళెంలోనే చాకువుంది. ఆపక్కనే వెండిమరచెంబూ, దాన్నిండా నీళ్ళూ. ఇంకోపక్కన గ్లాసు. దూరంగా వున్న చిన్న టీపాయిమీాద వెండి పాందానూ, పక్కలూ ఏలకలూ లవంగాలూ మొదలైన తాంబూలపు సామగ్రి వున్న వెండిపళ్ళెమూ, సెంటు

సీసా, పన్నీరుబుడ్డీ వున్నాయి. మంచంమీద మల్లెపువ్వులాటి తెల్లటి దుప్పటి ; తలా వైపున ముఖమల్ దిండ్లు రెండూ వాటిమీద మల్లెపూల దండా వున్నాయి. మంచానికి తలా దిక్కున ఒక స్టూల్ వుంది. దానిమీద ఎత్తుకు కాబోలు, ఛాంబర్స్ డిక్షనరీ, ఇండియన్ పీనల్ కోడూ వున్నాయి. వాటిమీద ఎలెక్ట్రిక్ టేబుల్ ఫాన్ అమర్చి వుంది.

రామారావు సూటు తీసేసి పంచె కట్టుకుంటూ ఆ యరేంజ్ మెంటు (Arrangement) చూసి తెల్లబోయాడు. లలిత గుమ్మం వద్ద నుంచుంది.

"రా లలితా"

"........."

"ఈ యరేంజిమెంటు చూసావా ?

"ఎవరు వేసారు ?"

"సరళే అయివుంటుంది"

లలితకూడా నలుదిక్కులూ పరిశీలించి తెల్లబోయింది.

మర్నాడు మధ్యాహ్నం కాఫీ వేళప్పుడు సరళ రామారావుతో అంది: "మీ మొహంలోనూ లలిత మొహంలోనూ సినిమా బడలిక చాలా అగుపిస్తోంది సుమండీ ! మళ్లీ కాఫీకప్పు పుచ్చుకొట్టకండే !"

కాఫీకప్పు బద్దలుకొట్టడ మేమిటని లలిత రామారావు వంక ప్రశ్నార్థకంగా చూసింది. తలెత్తుకోలేక కాబోలు రామారావు సాసరులోని కాఫీ తాగుతూనే ఓరకంట సరళని వీక్షించాడు.

"ఏం లలితా, నిన్నరాత్రి మీరు వెళ్ళిన సినీమా బావుందా ?" అని సరళ ప్రశ్నించగా లలిత కాఫీకప్పు తోణికింది. "ఏం లలితా, అంత తడబిడలాడుతున్నావేం ! !"

లలితకి, ఆ మధురహృదయకి, సరళ పట్ల కోపం రాలేదుకాని, తను గత రాత్రి సరళకేమయినా అపచారం చేసానా అని తన్ను తాను ప్రశ్నించుకొంది. సమస్యాపరిష్కార మవకపూర్వమే సరళ మళ్లీ అందుకొని, "ఇవ్వాళ కూడా సినీమాకి వెళ్ళదలుచుకుంటే మాటినీకివెళ్ళి ఏడయేటప్పటికి యింటికి రాకూడదూ ? భోజనాలు కూడా మానుకోవడం ఏం ఖర్మం ?

రామారావు సరే అన్నట్లు తల పంకించాడు. లలిత ఛాన్సు దొరికింది కదా అని యింట్లోనుంచి బయటపడింది.

ఆ రాత్రి రామారావు భోంచెయ్యగానే మేడెక్కాడు. లలిత మాత్రం సరళతో పదిగంటల దాకా యిష్టాగోష్ఠి

సాగించింది. తర్వాత దిండూ, చాపా ఎక్కడ వున్నాయని సరళని అడిగింది.

సరళ నవ్వుతూ: "నువ్వు మేడమీద పడుకో. నీకు మేడ మీద పక్క వేయించాను."

"నేను నీకు సాయంగా కిందనే పడుకుంటాను."

"నాకు సాయం మా అమ్మ వుంది. నువ్వు మా బావకి సాయం పడుకో."

"బావకి భయమా?"

"భయమో గియమో నాకు తెలీదు కాని యివ్వాళ కూడా మేడమీద పడుకో. రేపు నేనెలాగా యింట్లోకివస్తాను. అందరం మేడమీదనే పడుకోవచ్చు."

"హాల్లో నాకు వేరే పక్క వేయించావా?"

"ఎక్కడో ఒకచోట వేయించాను."

"........."

"అబ్బ!! వెళ్ళూ, నాకు నిద్రవస్తోంది. నంగనాచిలా కబుర్లు చెప్పకు."

ఆ మాటలు ఆమె వీపుని బాణాల్లా గుచ్చుకోగా, ఆమె వెళ్ళి రామారావు వళ్లోపడి, కిలకిలనవ్వుతూ, "ఈలాలన అంతా ఈ రాత్రికే కాదూ, రేపు రాత్రి సరకే వుంటుంది,"

అని అనేటప్పటికి రామారావు తెల్లబోయి, "యిది కామమా, ప్రేమా" అని తన్ను తాను తర్కించుకోవడం మొదలెట్టాడు.

ఆ పైన లలిత వారంరోజులు మద్రాసులో వుంది. వారిద్దరి స్వేచ్ఛకి సరళ ఎంతమాత్రం ఆటంకంగా నుంచోలేదు. భర్త ఆనందానికి అడ్డం రావడం పతివ్రతా లక్షణాలకి వ్యతి రేకమని సరళ మనస్ఫూర్తిగా నమ్మింది. ముగ్గురూ ఎంతో ఖులాసాగా వుండేవారు. నవ్వుతూ, తుళ్ళుతూ కబుర్లు చెప్పు కొనేవారు. ముగ్గురూ ముచ్చటగా సినీమాలకి పోతూ వుండే వారు. స్త్రీలో వుండవలసిన జెలసీ (jealousy) సరళలో లేక పోవడం ఒక వింతే!

లలితకి నెలతిరక్కుండా ఆమె తలిదండ్రులు పెళ్ళిచేసే సారు. వినాయకరావు ఎం., ఏ., ఐ. సి. యస్ భార్య అయి పోయింది. కలెక్టరుగారికి పెళ్లయి నాలుగు నెలలయిందోలేదో కాని ఆయన భార్యకి నాలుగోనెల కడుపు అన్నారు.

సరళ హృదయం మాత్రం రామారావుకి ఒక సమస్య అయిపోయింది. ఈ నాడు కూడా అతను ఎల్లిస్‌హావులాక్ (Ellis Havellock) సెక్సును పుస్తకాలు తిరగేస్తూ వుంటాడు, మీమాంస తేలిపోతుందేమో అనే అభిప్రాయంతో.

---

# లత

సుందరభవనం లోని యిరవై మూడో రూముతలుపు, లోనికి తోసాను. గమ్మున సిగరెట్టు పొగ నాసికా రంధ్రాల్లో ప్రవేశించింది.

గదంతా సిగరెట్టు పొగతో కమ్ముకువుంది. సిగరెట్టు పొగకి అలవాటు పడని వాడెవడయినా అవుతే, వుక్కిరి బిక్కిరి అయిపోయి, ఎలక పిల్లలా ఒక్క పరుగున యివతలకి వచ్చేస్తాడు.

ఆనందరావు వాలుకుర్చీలో కూచుని పొగ అతి తాపీగా వదులుతున్నాడు. అతను నా రాక గమనించలేదు. వరండా వైపు తిరిగి కూచున్నాడు. చేతిలో ఒక కాగితం వుంది. ఒక పరి నిదానంగా ఆ ఘక్కని బట్టి ఆలోచిస్తే, అతను తీరని విషమసమస్యల్తో కూడుకొన్న ఆలోచనా పరంపరలో మునిగి పోతున్నాడని ద్యోతకమవుతుంది.

పిల్లి నడకతో అతను కూచున్న కుర్చీ వెనక వైపుకి వెళ్ళి నుంచున్నాను. అతను అతి కష్టంమీాద తల పైకెత్తి, ఒక్క పూరు నా కళ్ళల్లోకి చూసి, మళ్ళీ తల దించేసుకొన్నాడు. ఆ నేత్రద్వయం చూసీ చూడగానే అతనేదో విషాదాశ్రత్తో వున్నట్లుగా స్ఫురించింది.

నేను ముందుకి వచ్చి, "ఏమిటంత దీర్ఘంగా ఆలోచిస్తు న్నావ్ !" అని అడిగాను.

"ఏమీ లేదు."

"వరండా వైపువున్న కిటికీ తలుపులయినా తీసుకో లేదు, చెమట పొయ్యడం లేదూ ?"

అతను మౌనదేవతని వరించాడు.

"ఆవరణ అంతా సిగరెట్టు పొగతో కమ్ముకొనివుంది," అంటూ కిటికీ రెక్కలు తెరిచాను.

ఒక్కసారిగా రివ్వున గాలి కొట్టింది.

టేబుల్ మీద వున్న కాగితమేదో గాలికి ఎగిరి అతని కాళ్ళ దగ్గిర పడింది.

మొట్టమొదట అది ఒక కాగితం ముక్క అను కొన్నాను. తీరాచూద్దునూ కదా అది ఒక రమణీమణి ఫోటో.

ఆ ఫోటో ఎగరడం అతను చూస్తూనే వున్నాడు. ఎగిరివచ్చి కాళ్ల దగ్గిర పడడం అతను జాగ్రత్తతో పరిశీలించనే పరిశీలించాడు. కాని, కించిత్తు అయినా చలించకుండా వున్నాడు.

ఇక, ఆఫొటో ఎలా వుందంటే, ఆలోలకలూ, ఆశిరోజ సౌష్టవమూ, ఆ నూనూగు చెక్కిళ్లూ ఆమె వయోవిలాసిని

అని తెలుపుతున్నాయి. ఆమె నేత్ర స్ఫూర్తిమలో గంభీరము లయిన వున్నత భావాలు గుమి కూడుకొని వున్నాయి. ఆ సులోచనని తేరబారి అవలోకిస్తూ వుండగా నా బుర్రలో ఒక అపశకునం పొడమినట్లయింది......ఆమె సజీవియా, విగతజీవియా? అన్న అనవసర సందేహం నా మెదడుని బాధ పెట్టింది.

ముందు వెనకలు ఆలోచించకుండా, ఆనందాన్ని, "ఈ అమ్మాయి ఎవరు?" అని అడిగాను.

"ఎవరవుతేనేం? ఇప్పుడు మాత్రం ఈ ప్రపంచంలో లేదు. ఆమె వుండకూడదని ఒకప్పుడు నేను శపించేసాను, తదనుగుణ్యంగా ఆమె లేదు కూడాను."

అరనిముషానికి పూర్వం ఆమె బతికివుందా చచ్చిందా అన్న సమస్య నాకు కలిగింది. ఆనందమిప్పుడు ఆమె ఈప్రపంచంలోనే లేదన్నాడు. నా మొహాన్ని నెత్తురు చుక్కలేదు.

"ఎవరు ఆ అమ్మాయి?" అంటూ మళ్ళీ మొదటికి వచ్చాను.

"ఇప్పుడే చెప్పాను కాదూ!"

"అలా చెప్పడం కాదు. ఆమె పేరు?"

"చచ్చినవాళ్ళకి పేర్లేమి వుంటాయి?"

అతని గుండె నిబ్బరమూ, ఆ కఠోర జవాబులూ నన్ను భయకంపితుణ్ణి చేసినై. ఇంకా, ఆలోచించగా ఆ ఫొటోలో అమ్మాయికీ, ఆనందానికీ, ఏ బంధుత్వమో, స్నేహమో, ఆఖరుకి పరిచయమో, వుండి తీరాలి, లేకపోతే, ఆ అమ్మాయి ఫొటో అతని దగ్గిర ఎందుకు వుంటుంది!!!

"బతికివున్నప్పుడు ఈ అమ్మాయిని ఏ పేరుతో పిలిచే వారు?" అని అడిగాను.

"కుతూహలం ఎందుకు? చచ్చిన వాళ్లు తిరిగి వస్తారా? రారు."

"ఆ విషయం ప్రతివానికీ తెలుసు."

"అలాటప్పుడు విగత జీవుల విషయంలో ఆ ఆదుర్దా, కుతూహలమూ ఎందుకు?"

ఆ మాటల ధోరణిని బట్టి చూస్తే ఆ అమ్మాయికీ, ఆనందానికీ చాలా పరిచయం వున్నట్లుగానూ, ఆనందానికి ఆ సంగతి సందర్భాలు నాకు తెలీడం యిష్టం లేదన్నట్లుగానూ, విశదమయింది. కాని, నేను మాత్రం ఆయువతి జీవిత గాథని తెలుసుకోందామని ఆవేదన పడడం మొదలెట్టాను.

"ఆ అమ్మాయి కథ నాకు చెప్పవ్ !" అని ఆనం దాన్ని గట్టిగా అడిగాను.

అంతవరకూ తల వంచుకొని మాట్లాడుతున్న ఆనందం హఠాత్తుగా తల పైకెత్తి, రాని చిరునవ్వు తెప్పించుకొని నవ్వుతూ, "ఏమిటీ ?" అని అన్నాడు.

" ఆ అమ్మాయి కథ చెప్పవ్ ?"

"ఏమంత ఆపేక్ష ?"

"ఏంచేతనో తెలీడంలేదు ; ఆమె మొహం చూస్తూ వుంటే జాలి కలుగుతోంది. నీకు ఆమె గురించి తెలిసిన విష యాలన్నీ చెప్పు."

"చెప్తాను, ఫ్లాస్కులోని టీ తాగిన తరువాత."

కుర్చీలో నుంచి లేచి, అతనే ఫ్లాస్కులోని టీ రెండు కప్పుల్లోనూ పోసాడు. ఇద్దరమూ తాగాం. సిగరెట్లు ముట్టించాం ! అతను వాలు కుర్చీలో ఆశీనుడయ్యాడు ; నేను ఎదురుగా వున్న పేము కుర్చీలో కూచున్నాను.

అతను కథ మొదలెట్టాడు !

"నువ్వు ఈ ప్రపంచమంతా ప్రేమఅనీ, సర్వాంతర్యామి ప్రేమస్వరూపుడనీ ప్రకృతి అంతా ప్రేమమయమనీ ఏమిటో ఏమిటో పద్యాలు వ్రాస్తావు. అదంతా బూటకం.

"బూటకం కాకపోతే హేమలత నన్ను తప్పకుండా ప్రేమించేది ; అంటే పెళ్ళి చేసుకొనేది. ఆ నిర్భాగ్యురాలు తన హృదయాన్నే వంచన చేసుకోకపోతే, ఆనందం అనే తేజోమూర్తిని బాహువల్లరిలో బంధించివుండేది," అంటూ ఆ క్షణం దాకా అతని పాదాలవద్దనే పడివున్న ఫొటోని చేతిలో పుచ్చుకొన్నాడు.

"లతది ఏ వూరు?"

"ఏ వూరేమిటి! గుంటూరులో నాతో బి. ఏ. చదివింది."

"నీవామెని ప్రేమించావా?"

"ప్రే...మిం...చ...క? ఆమె యింగ్లీషు ప్రొఫెసరు కూతురు."

"కథ కానియ్యి."

తెగిన కొస అందుకొన్నాడు !

ఆమెని చూడకుండా ఒక్క రోజయినా వుండ లేక పోయేవాణ్ని. మొట్టమొదట పుస్తకా ఎక్స్చేంజితో ఆరంభ మయిన మా స్నేహం రాత్రి వేళల దు రహస్యంగా కలుసు కోవడం దాకా సాగింది. హేమలత కూడా నే నంటే వెర్రిగా వ్యామోహ పడేది.

బి. ఏ. డిగ్రీ పరీక్షలయిపోయినై. నేడో రేపో మా వూరు వెళ్దామనుకుంటూ వుండగా ఒక మధ్యాహ్నం ప్రొఫెసరు నన్ను టీ కి ఆహ్వానించాడు. ప్రొఫెసరు ఏకైక సంతానమయిన హేమలతా, నేనూ, ప్రొఫెసరూ, ఆయన భార్యా టీ ఆరగించాం. కాసేపు పిచ్చాపాటీ చెప్పుకొన్నాం. ఎవరో స్నేహితులు రావడంచేత ప్రొఫెసరూ, స్నేహితురాలు రావడం చేత ప్రొఫెసరు భార్యా తప్పుకొన్నారు. నేనూ, నా నెచ్చెలీ మాత్రం మిగిలాం.

"పరీక్షలయిపోయినై. రేపెల్లుండిలో నేను మావూరు వెళ్తాను."

"వుత్తరాలు వ్రాస్తూ వుంటావా ?"

నాకు కొద్దిగా నిరుత్సాహం కలిగింది. తన్ను కూడా తీసుకు వెళ్లమని మాటవరసకైనా అంటుందేమో అనుకొన్నాను.

"ఎందుకు వ్రాయాలి ?" అని అన్నాను

"నీ యిష్టం," అంటూ దొంగ చూపులు చూస్తూ, లేనగవులు కురిపిస్తూ, తను కూచున్న కుర్చీ నా పక్కకి లాక్కొంది.

ఆమెని బిగి కౌగిలిలో బంధించి, ఆకలి తీరే దాకా ముద్దులు పెట్టుకొందామని కోర్కె జనించింది కాని కొద్ది కాలం వోపిక పట్టడం భావ్యమని తలపోసాను.

"లతా ! నువ్వు నన్ను ప్రేమించడం లేదూ ?"

"ఏం ? "

"ప్రేమిస్తున్నావా, లేదా ?"

"ఇప్పుడెందుకు ?"

"ప్రేమిస్తున్నావో, లేదో చెప్పు."

ఊఁ అన్నట్లు తలపంకించింది.

"నన్ను పెళ్లి చేసుకోవూ ?" అని అతివినయంగా అడిగాను.

"నా కింకా చదువు మానేద్దామని లేదు."

"పెళ్లికీ చదువుకీ సంబంధమేమిటి ? పెళ్ళయిన తర్వాత మాత్రం చదువుకో గూడదూ ?"

"పెళ్ళి చేసుకుంటే చదువెలాగ ?"

"చదువు కేమీ ఫరవా లేదు. పెళ్లి అనే సంస్కారం కలుగుతే కాని మన ప్రేమ పరిపూర్ణమవదు."

పెళ్లి అనే ముడి చదువుకి అడ్డంకు అనీ, స్త్రీ స్వాతంత్ర్యానికి అనర్థదాయకమనీ ఒకగంట లెక్చరిచ్చింది. నాకు స్కాలుకి యిరవై వేలరూపాయిలు వస్తాయనీ, యిద్దరమూ యింగ్లండులోనే చదుకోవచ్చుననీ బోధించి చెప్పాను. విన

లేదు. నాకు విసుగెత్తి. "ప్రేమిస్తావా, లేదా ?" అని నిష్కర్షగా అడిగాను.

"ప్రేమిస్తాను కాని పెళ్లి చేసుకోను."

నాకు వళ్ళు మండింది. హేమలత నా లాటి భాగ్యవంతుడ్నీ, అందవంతుడ్నీ, శౌర్యవంతుడ్నీ అలా నిరాకరిస్తుందని నేను కలలో అయినా అనుకోలేదు.

"నీ ప్రేమ అంతా వట్టి నాటకమా ?" అని అన్నాను.

"పెళ్లి చేసుకోనన్నంత మాత్రాన నాటకమనేనా నీ అభిప్రాయం ! ! ఇంత వరకూ నా ప్రేమలో నువ్వు ఏం లోటు కనిపెట్టావ్ ? పెళ్లి కాక పోవడంవల్ల మన ఆనందానికి ఏం అడ్డం వచ్చింది ?"

ముందు వెనకలు ఆలోచిస్తే నిజంగా ఏం లోటువుంది? మా సరస సల్లాపాలకీ, మా ఐహికసుఖాలకీ, మా ముద్దు ముచ్చటలకీ, ఏ లోపమూ లేదు. వివాహమనే బంధమే నన్నూ హేమలతనీ బంధించకపోతే నా లత ఏమయిపోతుందో అన్న భయం నన్ను పెనవేసింది. వివాహమనే సంస్కారం లేకుండా మా యిద్దరి అన్యోన్యత ఎంతో కాలం నిలవదనీ, కొంత కాలానికి యిద్దరి హృదయాలూ ఈర్ష్యా భావాలకి నిలవులవుతాయనీ అనుకొన్నాను.

ఆ అంగనామణి శరీరం తాకకుండా, ఆ ముద్దులమిటారిని ముద్దుపెట్టుకోకుండా, ఆ మంజులగాత్రి మాటలు వినిపించుకోకుండా రుసరుసలాడుతూ రివ్వున యింటికి పోయాను.

హేమలత నా తిరస్కృతికి విచార పడుతుందనీ, తన అజ్ఞానానికి పశ్చాత్తాపపడుతుందనీ, నాకోసం కబురు చేస్తుందనీ వెర్రిగా అభిప్రాయ పడ్డాను. కాని, అలాటి దేమీ జరగలేదు.

మూడు రోజు లయిపోయిన తర్వాత మళ్లీ వెళ్లాను. నన్ను ఎంతో ఆదరంతో అందు కొంది, చిరునవ్వుల్తోనూ, ముద్దు మొగంతోనూ, రసోక్తుల్తోనూ అందుకొంది. మేడ మీదవున్న తన స్టడీరూములోకి తీసుకు వెళ్లింది. టీ తీసుకు వచ్చి, కప్పులో పోసి, తాగమంది. నేను కుర్చీలో కూచున్నాను. ఆమె నుంచుంది.

"ఇంత కంటె రుచికరమయిన అధరామృతం యివ్వవ్?"

"ఇవ్వనని ఎప్పుడయినా అన్నానా, యివ్వడంలేదా?" అంటూ గది తలుపు వోరగా వేసివచ్చి, నా వెనక నుంచుని క్రాపు నిమురుతూ, "కోపం వచ్చిందా, నా మీద?" అని అడిగింది.

"లేదు."

"అవుతే, ఈ మూడురోజుల్నుంచీ రావడంలేదేమీ?"

"నువ్వే నన్ను పెళ్లిచేసుకోనన్నావు కాదూ?"

"అదుగో, అక్కడే వస్తుంది, పేచీ. నేను నిన్ను ప్రేమిస్తాను. పెళ్లి మాత్రం చేసుకోను. పెళ్లి చేసుకోవడమన్న మాటవద్దు. పెళ్ళిఅయినమర్నాడు నీకు నామీద ఈ గౌరవం వుండదు. నేను నీ వస్తువిని అయిపోయినట్లు భావిస్తావు. అప్పుడు మనకి కలిగే అసంతృప్తి వర్ణించడానికి అలవికాదు. ఇన్నేళ్ళు కాలేజిలో చదివిన తర్వాత, నేను ఒకరికి బానిసనై పోవడం సహించలేను. నువ్వు నన్ను గౌరవంగా చూడ గలిగి నన్నాళ్ళూ, నా హృదయంలో నీకు అత్యున్నతమయిన స్థానం వుంటుంది. ఏనాడు నేను నీ ఆస్తి నన్నట్లుగా తలపోస్తావో ఆనాడే.....అవును మీ వూరికి మావూరు ఎంతదూరమో. మా వూరికి మీవూరూ అంతే దూరం! ప్రేమకావలిస్తేనేను; పెళ్లి కావలిస్తే...మీ అన్నగారు ఏదో సంబంధం చూసారని ఆమధ్యని అన్నావు కాదూ, ఆ పిల్లని చేసుకో."

హేమలత తనకి పెళ్లంటే అసహ్యమనీ, పెళ్లి చేసుకో ననీ చెప్పేసింది.

కాని, పెళ్లి చేసుకోకపోతే అనేక చిక్కులు వున్నాయనే విషయం అతనికి అప్పటికి తెలీదు.

అయిదున్నర గంటలయింది. ఒకమారు సూర్యుడు మబ్బుల్లోకి పోయాడు. ఆకాశం నిండా గబగబా మబ్బులు కమ్ముకొన్నాయి. గాలిధుమారం లేచింది. పైవాళ్ళం పైనే వున్నాం. ముక్కుల్లోకీ, చెవుల్లోకీ, ధూళి ప్రవేసింప సాగింది. కిటికీ తలుపులు మూసి వెయ్యవలసి వచ్చింది. అన్ని తలుపులూ బిగాయించి హేమలత ఎలక్ట్రిక్ లైటువేసింది.

"లతా, చూడు. ఎంతలో ఎంత మార్పో! మూడు నిముషాలకి పూర్వం ఈ ప్రదేశమూ, పరిసరప్రాంతాలూ అతి ప్రశాంతంగా వున్నాయి. ఇప్పుడు గాలి ధుమారంతో ఎంత భీభత్సంగా వున్నాయో!"

ఆమె ఏమీ మాట్లాడలేదు.

"నన్ను పెళ్లిచేసుకొని, నీజీవితాన్ని అతి ప్రశాంతంగా చేసుకో. ఆచరణలో పెట్టడానికి వీలుకాని ఆశయాలు బుర్రలో పెట్టుకొని నీ జీవితమూ, సౌఖ్యమూ దగ్ధం చేసుకోకు."

"ఆనంద్, ఈ హేమలత దగ్గిర, ఈ స్వతంత్ర జీవిదగ్గిర పెళ్లి అనే విషయం తలపెట్టవద్దు."

"లతా, చెడిపోతున్నావ్! ఒక్క పరి ఆలోచించు."

"ఈ మూడు రోజులూ ఆలోచించింది చాలదూ?"

ఆమెదగ్గిర యిక నేనేమి మాట్లాడుతాను?

"నీలాటి స్వేచ్ఛావిహారికి నా హృదయంలో స్థానం వుండనేరదు," అని పురుషుడి అహంకారమూ, అధికారమూ, స్ఫుటంగా కన్పించేటట్టు అన్నాను.

"పోనీ, దానికి నేనేం చెయ్యగలను? పెళ్లి చేసుకు నువ్వు సౌఖ్య పడవోయ్!"

"నేను సౌఖ్యపడతాను. ఆ విషయం నువ్వు చెప్పే దేమిటి? కాని, నీజీవితం దగ్ధమయిపోతుంది. నాశనం. సర్వ శూన్యం. అగమ్యగోచరం."

"అయినా ఫరవా లేదు. నాకు మాత్రం పెళ్లి అనవ సరం. పురుషుడికి నేను దాస్యం చెయ్యను."

"నీ బ్రతుకు బండలై పోతుంది."

"అవనీ, ఆనంద్."

"నీ జీవితకుసుమాన్ని నువ్వు చేతులార నలిపేసు కుంటున్నావు," అని వారిస్తూ, ఆ గాలిధుమారంలోనే నేను వాళ్లింట్లో నుంచి బయలుదేరి వచ్చేసాను. ఆ మధుర మూర్తిని హృదయంలో నుంచి తొలిగించాను.

ఈ విషయం నేటికి సరిగ్గా ఎనిమిది నెలలకి పూర్వం జరిగింది. ఆరు నెలలు క్షయతో బాధపడి, ఆమె మొన్ననే చనిపోయిందట.

హేమలతని, నా హృదయంలోనుంచి ఎప్పుడు తుడిచి వేస్తానో, అప్పుడే గుర్తించగలిగాను ఆమె జీవితం గాలిలోని దీపమని. నా హృదయ సీమలో భద్రంగావున్న ఆమె పీఠాన్ని యెప్పుడు పోగొట్టుకొందో అప్పుడే నాకు తెలుసును ఆమె అభాగిని అనీ, కాలమనే దేవత ఆమెని కబళించేస్తుందేమో అనీ. ఆమెని వివాహమాడుదామని నేను అనుభవించిన కష్టాలూ, పడిన తిప్పలూ, నెత్తిని పెట్టుకొన్న నీలాపనిందలూ యిన్ని అనీ, అన్ని అనీ చెప్పేందుకు వీల్లేదు. ఆమె నా హృదయానికి చిచ్చుపెట్టింది. అందుకు శిక్ష అనుభవించవద్దూ? ఎప్పుడూ చెల్లుకి చెల్లు అన్న సూత్రం గుర్తువుంచుకో.

"హోటల్‌కి పోదాం, అంటూ,

## ఆనందం కథ ముగించాడు.

"హేమలతకి సలహా నిచ్చేవా రెవరూలేరు. ఆమె విషయం తల్చుకుంటే జాలేస్తోంది. పాశ్చాత్య సంపర్కం ఆమెని పాడుచేసింది," అని అన్నాను.

అదే వద్దంటాను. పాశ్చాత్య సంపర్కం ఆమెని పాడుచేసిందనకు. నేను చెప్పినట్లు వినకూడదూ ?"

పురుషుడి లోని ఆ అహంభావత్వం తరతరాల నుంచీ వస్తోంది. ఇవ్వాళ పొమ్మంటే పోదు. చనిపోయిన లతా వివేకవతి కాదు ; బతికి వున్న ఆనందమూ స్ఫురద్రూపి కాడు. తన్ను బానిసగా చేస్తాడేమో అని ఆమె అపనమ్మకం ; తనకి అనుకూలవతి కాకపోతుందేమో, అనిఅతని అపనమ్మకం. అంచేత, పెళ్ళిఅంటూ బంధం కోసం అత నూ, ప్రేమఅంటూ స్వాతంత్రంకోసం ఆమెపాకులాడారు. నిజంగాఅప్పటికి వారిద్దరి మధ్యనూ నాలాటి వ్యక్తి ఎవరయినా వుంటే ఆనందరావూ, హేమలతా అన్యోన్యదంపతులై వుండేవారు కదా ! ! అతను హేమలతని మర్చిపోయి చాలా రోజులై వుంటుంది. ఇప్పు డతని మోజంతా మాధురి మీద వుంది.

"హోటల్ కి పోదాం," అని నేను రెట్టించాను. హోటల్ కి పోయాం.

---

# డైరీలో

[మిసెస్ నాగభూషణం డైరీలో, ఆగష్టు 19: ఎలా నవుతేనేం, ఈనెలలో బొంబయిలో వర్షాలు ఎక్కువగానే వున్నాయి. శ్యామల తెల్లారిన తర్వాత నాకోసం నాలుగు సార్లు ఫోనుచేసింది. మధ్యాహ్నం వారింటికి బయలుదేరాను. నేను బయలుదేరేటప్పటికి చినుకుఅయినా లేదు. దారిలో పట్టుకుంది. కుంభవర్షం కురిసింది. తడుస్తూ తడుస్తూ కారులో నుంచి దిగాను. ఇవ్వాళ శ్యామల నవ్వుమొగంలో సెంటిమెంటల్ ఫీలింగ్సు అగుపించినై. గుమ్మందగ్గర (నాకోసమే కాబోలు) కనిపెట్టుకు నుంచుంది. మిస్టర్ శంకరం యింటిలో లేడనుకొన్నాను. నేను వెళ్లీ వెళ్లగానే ఒకకప్పు టీ చలితో వణకుతున్న నాచేతులకి అందిచ్చింది. ఎందుకు ఫోను చేసావని ప్రశ్నించాను. మరాఠా తుకారాంకి పోదాంమా అని నన్ను అడిగింది. 'వర్షంలోనా!! నువ్వు ఏదయినా ఒక చక్కని కథ చెప్పు. వర్షం తగ్గినతర్వాత సినిమాకి పోదాం' అని అన్నాను. కథలు చెప్పడంలో ప్రావీణ్యత సంపాయించిన శ్యామల తన జీవిత గాథ యిలా మొదలెట్టింది.]

నిజంగా శంకరం అనే వ్యక్తే నాకు కనిపించకపోతే ఈ జీవితం ఈ ఆనందమయ సుఖజీవితం, ఎంత దగ్ధమయిపోయేదో,

ఎంత నాశనమయిపోయేదో, ఎంత దురదృష్టవంత మయి పోయేదో, ఎంత కళావిరహిత మయిపోయేదో! వాస్తవంగా నట్టడవిలోని మంచిగంధంచెట్టు మాదిరి అయేది!!! అబ్బ!! నాకోసం దేవుళ్లాడే మనిషి ఒకడున్నాడు కదా! అదే నవ రత్నాల్ని మించిన ఆభరణం. వెలలేని హృదయధనం. జీవితం ఎంతచక్కనిదీ!! నాకింకేంకావాలి? ఏమీ అక్కర్లేదు.

అతను 1926 సెప్టెంబరులో కాబోలు, ఒక మంగళ వారం సాయకాలం మా యింటికి వచ్చాడు. అదే మా ఇద్దరికీ ప్రథమ సాంగత్యం. నేనప్పుడే, దొడ్లో స్నానంచేస్తున్న నా భర్త వెంకట్రామయ్యగారికి వీపు రుద్ది, తువ్వాలు యిచ్చి, సావిట్లోకి వచ్చాను. అతను సావిట్లోనిట్టనిలువుగా నుంచుని నాల్గు పక్కలూ పరిశీలిస్తున్నాడు. నేను కొద్దిగా వెనక్కితగ్గి, "ఎవరి కోసమండీ?" అని ప్రశ్నించాను.

"నీభర్త కోసమే!" అని అతని జవాబు. అతని జవాబు,—ఆ పెంకి జవాబు,— ఆ మొరటు జవాబు నన్ను కలవరపెట్టింది. ఎవరా ఈ అసందర్భ ప్రలాపి అన్నట్లు అతన్ని తేరబారి చూసాను.

ఎడం పాపిట, మీసాలు పూర్తిగా తీయించేసాడు. వుంగిరాల్ల జుట్టు, పదే పదే అతని మొహంతో బూచులాడు

తోంది. నల్లని నేత్రాలకి స్వచ్ఛందమయిన క్రూకుస్గ్లాసులు, బంగాళాకట్టు, గ్లాస్కో మల్లుపంచె, సిల్కులాల్చీ, కాళ్లకి ఫుల్ స్లిప్పర్సు, లాల్చీకి రెండు క్రిమెన్ను గుండీలూ, ఒక రోల్డుగోల్డు చైనూ, ఒక పిన్నూ, ఎడంచేతిలో సిగరెట్టుపెట్టె, అగ్గిపెట్టె, కుడిచేతిలో సిల్కు జేబురుమాలు, వయస్సు అప్పటికి యిరవైమూడో యిరవై నాలుగో వుంటుంది.

ఆ అపర బంగాళబాబుని ఆపాదమస్తకం పరకాయించి అతను నాటకాల్లో వేషాలు వేసే వాడై వుంటాడని నిశ్చయించుకొని "ఆయన స్నానం చేస్తున్నారు. కుర్చీలో కూచోండి," అని అతిథిసత్కారం చేసాను.

చిరునవ్వు పెదవులమీద తొలుకాడుతూ వుండగా అతను ఆశీనుడయాడు. ఎవరా ఆ రౌడీ అన్నట్లు భావిస్తూ, 'అమ్మాయీ! ఆవుని కట్టెయ్యవే!' అని మా అత్తగారు నన్ను అదమాయించడంచేత దొడ్లోకి వెళ్లాను.

పది నిముషాలు గడిచిన తర్వాత వాళ్ళిద్దరి సంభాషణ విన్నాను.

వెంకట్రామయ్యగారు:- మమ్మల్నందర్నీ వదిలేసి బొంబయిలోనే వుండిపోతావన్నమాట.

అతను:- ప్రస్తుతంలో అక్కడ్నుంచి మారాలనే అభి ప్రాయమేమీ నాకు లేదు.

వెంకట్రామయ్యగారు:- నాకు పెళ్లయినతర్వాత ఒక్క తఫా కూడా నువ్వీవైపు రాలేదు కాదూ!!

అతను:- రాకేం! వచ్చాను,—ఒకసారి. కాని నీ భార్య అప్పటికింకా కాపరానికి రాలేదు.

వెంక:-అవుతే నాభార్యని నువ్వుచూడనే లేదన్నమాట!

అతను:- చూసాను. నిన్న సాయంకాలం నరసమ్మత్త య్యగారింటికి పేరంటానికి వచ్చింది కాదూ!! నేను యింట్లోకి వచ్చేటప్పటికి ఆ అమ్మాయి సావిట్లో వుంది. చాలా చురుకయిన మనిషి, నన్ను కూర్చోమని మర్యాద చేసింది.

ఇంతలో 'ఒసేవ్' అని వెంకట్రామయ్యగారు నన్ను పిలిచారు. అవును, అతనికి నన్ను చూపేందుకే! నేను సావిట్లోకి వెళ్లాను.

'ఇతనేం,—మా వెంకన్న మామయ్య వున్నాడు చూసావు కాదూ,—అతని పినతల్లి కోడలు పెంచుకొన్న అబ్బాయి. మేమూ, మేమూ ఒక నరుల్లో వాళ్లమే! ఇద్దరమ్మా ఒకే చోట చదువుకొన్నాం' అని అన్నారు వెంకట్రామయ్యగారు.

అసలు వెంకన్నగారికి వెంకట్రామయ్యగారికి దూరపు చుట్టరికం. అలాంటి వెంకన్నగారి పినతల్లి కోడలు పెంపుడు కొడుకట,—సిగరెట్లు తగలేస్తూ కుర్చీలో అతి ఠీవిగా కూచున్న ఆ మహానుభావుడు.

మా అత్తగారు 'ఎప్పుడొచ్చావురా, శంకరం!' అని అంటూ రంగసీమ ప్రవేశించింది.

వారి యిష్టాగోష్టివల్ల నేను గ్రహించగల్గిన సారాంశ మేమిటంటే, అతను నాటకాల్లో వేషాలు వేసేవాడు కాడనీ బొంబయిలో నెలకి రెండువందలు వేతనం అందుకుంటున్న ఒక ప్రయోజకుడనీ; పయిగా — అవివాహితుడనీ. రాత్రి భోజనానికి వుండమని మాయింటివారు అతన్ని బలవంత పెట్టారు. అతను సరే అన్నాడు.

మా అత్తగారు వడ్డన చేసింది. నేను నెయ్యీ, మజ్జిగా అందిచ్చాను. అతను భోంచేస్తున్నంతసేపూ బొంబయి పుర వైభవాల్ని విపులంగా వర్ణిస్తూ, నన్ను వోరకంట చూస్తూనే వున్నాడు. మొట్టమొదట ఆ రకమైన చూపుల్ని ఎంతో అస హ్యించుకొన్నాను. మరుసటి రోజునా, మూడో రోజునా కాంక్షలూరించే ఆ కమ్మటి చూపులకీ, ఛలోక్తులకీ, లేనగవు లకీ ముడి పడిపోయినట్లు నామనస్సు ఏమిటో తెలీరాని ఆనం దాన్ని వాంఛించడం మొదలెట్టింది. అదే ఈవిప్లవ జీవితానికి ప్రథమ సోపానం.

[illegible]

[illegible] లు.

## రొమాన్సు

శుక్రవారం. రాత్రి పన్నెండు గంటలవుతుంది. పక్కని పరున్న వెంకట్రామయ్యగారు దొంగలకి భయోత్పాతం గొల్పేటట్టు గురకపెట్టి నిద్రపోతున్నారు. నాకు మాత్రం నిద్ర పట్టలేదు.—అన్ని జీవులూ సుషుప్తావస్తలో మునిగితమ తమ కష్టనష్టాలు కూడా మర్చిపోయే ఆ సమయంలో. దొడ్లోవున్న సంపెంగ సాటిలేని వాసనల్ని వెదజల్లుతోంది. చంద్రబింబం తనలోని మచ్చతోకూడా నిర్మలంగానూ, దేదీప్యమానంగానూ ప్రకాశిస్తోంది. వూరంతా మాటు మణిగింది. ఎక్కడో దూరంలోని కుక్క మొరుగుడు మాత్రం నా వీనులకి వినపడ్తోంది.

నిద్రపట్టక విసుగు తోచి, మంచంమీద కూచున్నాను. మేఘుపంక్తే పరిగెడ్తోందా, లేక తారా మనోహరుడే ప్రేయసికోసం పరిగెడ్తున్నాడా అనే సమస్య పరిష్కరించే దానిలా జారచోరులకి సమయమయిన ఆ నిశీథవేళ, కిటికీ వూచల్లోనుంచి, శశాంకుడ్ని పరికిస్తూ ఆలోచిస్తున్నాను :

“ఈ పతివ్రతాలలామ నిర్భాగ్య జీవితం, ఈ భర్త సేవకి దుఃఖజీవితం, ఈ మానినీమణి ఘోరజీవితం యిలాగే గడచిపోవాలి కాబోలు! అయిదేళ్లూ గడవలేదూ!! ఆలాగే గడచిపోతుందేమో!!!

"హృదయాన్న గులాబిపువ్వు కోసుకొందామని సరదా పడ్డాను. సాయంకాలం కోసుకోవచ్చునని మరు క్షణంలో తృప్తి. సాయంకాలానికి పువ్వే మాడిపోయింది.

"పదమూడో ఏట పెళ్లి, పద్నాలుగో ఏట గర్భాదానం, పదిహేనో ఏట వేవిళ్లు, పదహారో ఏట పుత్రజననం, పదిహేడో ఏట పుత్రశోకం. ఇప్పుడు పద్ధెనిమిది ఏళ్లు. ఇవి ఈ జీవిత ఫలాలు. ఏం అనుభవించానో, ఏం ఆనందించానో, ఏం సౌఖ్య పడ్డానో నాకే తెలీదు.

"ఎంచేతనో జీవితంలోని మాధుర్యం పూర్తిగా నశించి పోయింది. పొద్దున్నే లేస్తాను. ఏడింటికి కాఫీ, ఎనిమిదింటికి కూరతరగడం, తొమ్మిదింటికి స్నానాలకి నీళ్లు అందివ్వడం, పదింటికి మామగారూ, బావగారూ భోంచేస్తారు. పదకొండిం టికి వెంకట్రామయ్యగారి భోజనం, పన్నెండింటికి నాభోజనమూ, అత్తగారి భోజనమూ, ఒంటిగంటకి మరిది స్కూలునుంచి వస్తాడు. అతనికి భోజనం, రెండుగంటలకి బడలికచేత కాస్త కునుకు పోతాను, మళ్లీ మూడింటికి టీ, నాలిగింటికి లాంతర్లు తుడుచుకోవడం, అయిదింటికి కూర తరుక్కోవడమూ, ఆరిం టికి మడీ, రాత్రి పదిగంటలదాకా, బావగారు సినిమానుంచి తిరిగి వచ్చేదాకా మడితోనే వుండాలి. మధ్యని ఏమైనా కాస్త తీరిక వుంటే,—మినుములు విసురుకోవడం, • అప్పడాలు

వత్తడం, వడియాలకి పప్పు రుబ్బడం వగైరాలు, కూపస్థ మండూకంలా ఈ దిక్కుమాలిన బతుకు యిలాగే తెల్లారాలి కాబోలు!

"ఇంట్లో విషయం చూదామా అంటే అత్తమామలు ఎంతో గౌరవిస్తారు. బావగారూ ఎంతో దయతో చూస్తారు. మరిది తన మాటలలో ఆదరం కుప్పించేస్తాడు. ముసలమ్మలు పిచ్చాపాటీ కులాసాగా చెప్తారు. ఇక భర్త. అక్కడే వస్తుంది పేచీ. ఆయనకి నాతో అవసరం ఎంతకీ రాత్రిపదిన్నరనుంచీ, పదకొండుదాకా. మిగతావేళలందు నేనువున్నాసరే, చచ్చినాసరే ఆయనకి అవసరంలేదు. ఆయనదృష్టిలో స్త్రీ పురుషుడి భోగ్యవస్తువు. ఆయనకేలాటి కోరికలు వుంటాయో నాకూఅలాంటివే వుండవచ్చునని ఆయన వూహించరుకదా ?. ఆయన కామాన్ని తీర్చే నా శరీరవిషయమయినా ఆలోచించరుకదా ఆఖరుకి ! ! హాయిగా గురకపెట్టి నిద్రపోతున్నారు. భర్తవిషయం తలుచుకుంటేనే వ్యవహారం విషమిస్తుంది. జీవితంమీద విరక్తి జనిస్తుంది. ఈవిరక్తి ఎలాపోతుంది. జీవితంలో ఈనిస్సృహాత్వం ఎప్పుడు మటుమాయమై పోతుంది... అవును, సంతోషం కావాలి. జీవితానికి నూతనోత్సాహం కావాలి. ఎలా వస్తుంది? ఎక్కడ్నుంచి వస్తుంది? ఎక్కడ్నుంచి కాదు, ఎ..వ...రి...దగ్గిర్నుంచి?"

తెల్లారిన తర్వాత నా వెర్రి వూహాలకి నా బుద్ధిని నేనే మందలించుకొన్నాను.

మధ్యాహ్నం మూడు గంటలకి శంకరంవచ్చాడు. ... వున్నారా అంటూ. లేరన్నాను. కూచోమని మర్యాద చేసాను.

"మీా అత్తగారు యింట్లో వున్నారా ?"

"లేరు."

"నువ్వు ఒక్కతెవూ మాత్రమే వున్నావా?"

"అవును."

అతను లేద్దామని ప్రయత్నించాడు.

"అత్తగారు వచ్చేవేళ అయింది."

"..............."

"మంచినీళ్ళు కావాలా ?"

"వద్దు."

రెండు నిమిషాలపాటు మాయిద్దరికళ్ళూ మాటాడినై.

"శ్యామలా, నేను ఒక విషయం చెప్తే నువ్వు నమ్మ తావా ?"

"చెప్పండి."

"నమ్ముతానంటునే చెప్తాను."

"మీరు చెప్పడమూ, నేను నమ్మకపోవడమూనా ?"

"నేను నిన్ను వదిలి వెళ్ళలేక యిన్నాళ్ళనుంచీ ఈ వూళ్లో వుంటున్నాను."

నేను ఆ మాటలకి కంగారు పడలేదు. అతనికి నా మీద కోరిక వుందని నేను ఎప్పుడో గ్రహించాను.

"శ్యామలా! నేను నిన్ను ప్రేమిస్తున్నాను. నువ్వ నన్ను ప్రేమిస్తున్నావని, నాకోసం తహతహలాడి పోతున్నావనీ నాకు తెలుసు."

ఆ మాటలు, అప్పటికి ఒక పరాయి మొగవాడయిన శంకరం నోటి నుంచి వచ్చాయిగానీ, ఆ మాటాలే వెంకట్రామయ్యగారి నోటినుంచివస్తే, ఆయన్ని ముద్దులతో ముంచెత్తేయ్యడమే కాకుండా ఆ జన్మాంతమూ చరణ దాసినై వుందును. ఈ ప్రేమ విహంగం ఆ నోము నోచుకోలేదు. అంతమాత్రాన ఆయన నన్ను ద్వేషించాడనీ నా అభిప్రాయం కాదు.ఆయన నన్ను ద్వేషించనూలేదు. నేను కూడా ఆత్మ వున్న ఒక జీవిని అనే విషయం ఆయన కెప్పుడూ తట్టలేదు. ఇప్పటికైనా తట్టి వుంటుందని అనుకోను. ఆయన తనకీ భార్య మీద వుండే హక్కుని వుపయోగించుకొనే వాడు. పశువుకి

మేతవేసినట్లే నాకూ మేత వేసేవారు. పశువు పాలిచ్చినట్లే నేను యింటి చాకిరీ చేసేదాన్ని. ఎటొచ్చీ పిల్లల్ని మాత్రం కనలేదు.

అతని మాటలకి నేను తల వంచుకొని, చిరునవ్వొకటి అతని మీదికి ప్రసరింప జేశాను.

"ప్రేమించడం లేదూ, శ్యామలా ?"

"అదేమిటండీ అలా మాట్లాడుతారు; ఎవరయినా వింటారేమో కూడాను. అప్రతిష్ట."

అతను కుర్చీలో నుంచి లేచాడు. వెళ్ళిపోతాడేమో అనుకొన్నాను. అలా జరగలేదు. నా దగ్గరికి వచ్చాడు. నన్ను అతని బాహుబంధంలో బంధించి మాట్లాడనియ్యకుండా, ఎడతెరిపి లేని ముద్దులవర్షం నా మొహంనిండా కురిపించి బుగ్గలు గాట్లు పడేలా కొరికి, వాలు కుర్చీలో కూలబడి, నా వంక దీన దృష్టులు ప్రసరింప జేయడం ప్రారంభించాడు.

నాకు ఆ కౌగిలి అపూర్వమైన ఆనందాన్ని యిచ్చినా, అతన్ని చెడా మడా తిడ్దామన్నంత కోపం వచ్చింది. జాలిని నదీ ప్రవాహంలా ప్రవహింప జేస్తున్న అతని చూపులు నా ప్రణయ కోపంలోని కోపాన్ని అణిచిపెట్టినై. తలుపుని ఆనుకొని నేను పూర్వం నుంచున్నట్లే నుంచున్నాను.

మూడు నిముషాలు గడిచిన తర్వాత అతను నన్ను కుర్చీలోకి లాక్కుందామని ప్రయత్నించాడు. నేను పెనగు లాడాను. అతను నాచెక్కిళ్ళంటుకొని అతి దీనంగా బతిమి లాడాడు. ఆ ప్రార్థన తలుచుకుంటే యిప్పుడు కూడా నావళ్ళు గగుర్పాటు జెందుతుంది. ప్రేమలో అన్ని వోషధులు వున్నాయి కాబోలు. మొదట కొద్దిగా బెట్టు చేసినా, తర్వాత అతని చేతిలోని కీలుబొమ్మనై పోయి, పతివ్రతా లక్ష్యాలకి ఫుల్‌స్టాప్ పెట్టి అతని వళ్ళో కూచున్నాను.

"శ్యామలా ! నన్ను ప్రేమించడం లేదూ ?

"................"

"శ్యామలా, నన్ను ప్రేమించవ్ ?"

"ప్రయోజనం ?"

"నువ్వు రాణిలా బతకవలసిన దానివి. ఇక్కడగొడ్డులా చాకిరీ చెయ్యడానికి తగవు. నన్ను ప్రేమించు."

"ప్రేమించి ?"

"ఇద్దరం కేళికారామ మందిరాల్లో భూలోక స్వర్గానం దాన్ని తనివితీర అనుభవిద్దాం."

ఆ మాటల్తో నా ఆనందం పట్టపగ్గాలు లేనిదై పోయింది. అతన్ని విపరీతమైన కాంక్షతో కౌగలించు కొన్నాను.

"శ్యామలా, నీ మూర్తికి నా హృదయంలో యావ జ్జీవమూ స్థానం వుంది."

"నిజంగా ?"

"త్రికరణశుద్ధిగా, నువ్వే నాకుఅవిరళానందాన్ని కూర్చ గల్గే ప్రేమ స్వరూపిణివి."

నాకు ఏం జవాబు చెప్పాలో తెలీలేదు. అతనికి నామీద ఆదర్శప్రాయమైన ప్రేమ వుందని మనస్ఫూర్తిగా నమ్మాను. ఇంతలో మా అత్తగారు ప్రత్యక్షమయింది.

ఆ రాత్రే శంకరం బొంబయి వచ్చేసాడు కాని ఆ సంవత్స రంలో నాకోసం పదెనిమిదిసార్లు మా వూరు వచ్చాడు. ప్రతి తూరీ వెళ్ళేటప్పుడు నన్ను వదలలేక వదలలేక వెళ్ళేవాడు. అతను వెళ్లిన రెండురోజులుదాకా నాకూ ఏమీ పొద్దు పోయేదికాదు.

1927 క్రిష్టమస్‌లో కాబోలు సాహసంచేసి శంకరంతో కూడా నేను ఈ వూరువచ్చేసాను. శంకరం జీవిత మాధుర్య మేమిటో చవిచూపాడు. శంకరానికూడా నేనంటే వెర్రి

ప్రేమ. నన్నువిడిచి ఒక్కరోజయినా వుండలేదు. వెంకట్రామయ్యగారు రెండోపెళ్ళి చేసుకొన్నారట. ఇప్పుడు యిద్దరు పిల్లలనికూడా విన్నాను, పాపం! వెంకట్రామయ్యగారు చాలా అమాయకపు బ్రాహ్మడు సుమా!

[వేడి నిట్టూర్పు విడుస్తూ శ్యామల కథ ముగించింది. నేను గాథంతా విని తెల్లబోయాను. మిష్టర్ అండ్ మిసెస్ శంకరంకూడా హిందూ సాంప్రదాయాన్ని అనుసరించివివాహమాడిన భార్యాభర్తలు కారని తెలుసుకొన్నాను. శ్యామల చాలా ధయిర్యంగల పిల్ల. సినీమాకి బయల్దేరుదామని శ్యామల ముస్తాబవుతూ వుండగా మిష్టర్ శంకరమూ, మిష్టర్ నాగభూషణమూ ప్రత్యక్షమయారు. నలుగురమూ సినీమాకి వెళ్ళాము. మేమిద్దరమూకూడా ఆ రాత్రి శంకరమ్స యింట్లోనే విందు ఆరగించాము. ఇల్లుజేరు కొనేటప్పటికి పది అయింది. బడలికచేత వెంటనే నిద్రపోయాను.]

---



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA129B125 |
| పుస్తకం పేరు | రామాప్పు 03 |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 59 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 4,28,144 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Navya |
| పేజీలు విడదీసినది | Thajin |
| స్కాన్ చేసినది | Aswini |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |